# హిరణ్మయి

(యుగళాంగుళీయకము)

బంకించంద్ర చటర్జీ రచనకు

శ్రీ తల్లంరాజు సుబ్బారావుగారి ఆంధ్రీకరణము



పబ్లిషర్సు:

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో

రాజమండ్రి

1955

 [వెల రు 0—6—0

# పీఠిక

ఈ నవల మిగులఁ జిన్నదైనను కథాకల్పనాది చమత్కారములయం దసమానమై విరాజిల్లుచున్నది. ఇయ్యది బంగాళా దేశ కవిచంద్రుఁడగు బంకించంద్రచటర్జీగారిచే బంగాళాభాషలోఁ దొల్త వ్రాయఁబడినది. అందుండి రఖేల్ చంద్రబెనర్జీ, బి. యే గారు దాని నాంగ్లేయభాషలోనికిఁ బరివర్తనము చేసిరి. దాని నాధారముచేసికొని నే నీ యాంధ్రీకరణ మొనరించితిని. ఇక్కథ యందు రెండుంగరములు ప్రధానమైనవై నాయికానాయకుల వివాహానంతరము వారలొండొరులు గుర్తించుకొనుట కాధారమైన వగుటచే నీ నవలకు యుగళాంగుళీయకము అను నామాంతరముగూడ పెట్టఁబడియెను. ఈ నవలయొక్క ప్రాశస్త్యమును జదువరులే గ్రహింపనై యున్నారు. కావున వివరించి వ్రాయమానితిని,

ఇట్లు

తల్లంరాజు సుబ్బారావు

శ్రీరామచంద్ర

# హిరణ్మయి



## మొదటి ప్రకరణము



ఉద్యానవనమున నొక పూఁబొదరింటిక్రింద నిరువురు నిలువఁబడియుండిరి. అనంతమయిన నీలసముద్రము మెల్లఁగ మర్మరధ్వని చేయుచు, తామ్రలిప్తపట్టణముయొక్క పాదములను నిర్మలము చేయుచుండెను.

తామ్రలిప్తపట్టణమున నొకకొనను సముద్రతీరమున శృంగారమైనభవన మొకటికలదు. దానిని జేరి మనోహరముగ నాటఁబడిన ఫలవృక్షములతో నిండినతోఁట యొకటి యుండెను. అది ధనదాసుఁడను నొక వర్తకునిది. ఆతని తనయ హిరణ్మయి యొక తరుణవయస్కునితో నా లతాగృహమున మాటలాడుచుండెను.

హిరణ్మయికి పెండ్లియీడు దాఁటినది. ఆమె తనకుఁ దగినవరుని గోరి పదునొకండవయేఁటినుండియు సముద్రతీరముననున్న సాగరేశ్వరీదేవిని బూజించుచుండెను. కాని కామె యభీష్టము నెఱవేఱినది కాదు.

ఆకన్య యాచిన్నవానితో నొంటరిగ నేల మాట్లాడు చుండెనో యందఱు నెఱుఁగుదురు ఆమె నాలుగేండ్ల ప్రాయముఁగల దయినప్పు డాతఁ డెనిమిదిసంవత్సరముల బాలుఁడు ఆతని తండ్రి శశిసుతుఁడు. వడ్డివర్తకుఁడు ధన దాసుని పొరుగింటివాఁడు. అందుచే నీబాలుఁడును బాలిక యును తమ పసిప్రాయమున నాటలాడుకొనెడివారు. మఱియు వారిరువురును నొకరి నొకరు విడువక ధనదాసుని యింటనో శశిసుతునియింటనో యుండి యాటలాడు కొనుచు కాలముఁ బుచ్చుచుండెడివారు. ఇప్పు డా బాలిక పదునొకొండేండ్ల యౌవనవతి. ఆ బాలుఁ డిరువదేండ్ల యౌవనుఁడు, అయినను పసితనమున వారికిఁ గలిగిన స్నేహ మిప్పటికి నష్టమయ్యెను, అయినను వారిస్నేహభావ మున కొక చిక్కు సంభవించినది. యుక్తకాలమున వారితండ్రు లియిరువురకును వివాహమును నిశ్చయించిరి. ముహూర్త దినము కూడ స్థిరపఱుపఁ బడియెను. ఇంతలో హిరణ్మయి తండ్రి యాకస్మికముగ "నాకుమారైకుఁ బరిణయము చేయను." అనియెను, నాఁటినుండియు హిరణ్మయి పురంద రుని జూచుటలేదు. "నీతోఁ గొన్నిసంగతులు చెప్పవలసిన దనియు, ఒక్కమారుదర్శనమి" మ్మనియు నతివినయముగ వేఁడుకొనుచుఁబురందరుఁ డీ సమయమున హిరణ్మయికి వర్త మానమంపెను. హిరణ్మయి లతాగృహమునకు వచ్చి "నీ వెందులకు నన్నుఁ బిలిపించితివి ? నేనిప్పుడంత చిన్నబాలి

కను గాను. ఇట్టిప్రదేశమున కొంటరిగ నీదర్శనమునకు వచ్చు టుచితముగాదు: ఇంక నొకసారి నీవడిగిన సేపటకు రాను" అనియెను.

పదునారేండ్ల యువతి "నేనంత చిన్న బాలికనుగా" నని చెప్పు వాక్యములు వినుట కెంత మనోహరముగ నుండును! కాని యందలిసారస్యమును గ్రహించువారుమాత్ర మొక్క-రైన నట లేక పోయిరి, ఆవాక్యమాధుర్యమును గ్రహించు టకేఁ బురందరునకు వయసు చాలదు. అతనిమనస్థితియు నంత యనుకూలముగ లేదు.

పురందరుఁ డా పూప్రటీరమున నల్లుకొనియున్న లత నుండి యొక పుష్పమును, ద్రుంపి కంపముతోఁ దానిని ముక్క-లుగఁ జేయుచు "మఱల రావలయు నని నిన్ను నేఁగోరను. నేనిప్పుడు చాల దూరదేశము పోవనున్నాఁడను. నీకడ సెలవుఁగయికొన నిటువచ్చితిని" అనెను.

"దూరదేశమా? ఎక్కడకు?"

"సింహళమునకు"

"సింహళమునకా? అద్దొ! సింహళ మొదల కేగుచుంటివి?"

"ఎందులకుఁ బోవుచుంటివా? మేము వర్తకులము గదా! వ్యాపారమునకై యేఁగుచున్నాను."

ఈమాట లనునప్పుడు పురందరుని నేత్రముల నీరు గ్రమ్మెను.

హిరణ్మయిమనఃపరిభ్రమమున మునింగిపోయినట్లుగనప్పట్టుచుండెను. సముద్రతరంగములపై నాట్యము సేయుచున్న సూర్యకిరణములపై నామెదృష్టిని నిశ్చలముగ నుంచి చూచుచుండెను. అది ప్రాతఃకాలము. కమ్మని మందమారుతము వీచుచుండెను. మలయమారుతప్రసరణంబున నా సముద్రమునం దుదయించిన కోమలతరంగముల యగ్రభాగములయందు బాలభానునికిరణములు తళతళ మెఱయుచుండెను. మఱియు ననంతమయిన యా సముద్రోదకమున సమోన్నతములయిన ప్రభాతారుణకిరణజాలము లనంతముగ వ్యాపించుచుండెను. నల్లని మేనికాంతిగల స్త్రీపై వెండియాభరణము లలంకరించి నటుల నల్లని సముద్రోదకమున నురుగుముద్ద లొప్పుచుండెను. తెల్లని నీటిపక్షులు బారులుదీర్చి సముద్రతీరమున నటునిటు సంచరించుచుండెను. హిరణ్మయి వీనినన్నిటిం జూచెను. ఆనల్లనియుదకము, ఆయిసుకతిన్నెల నంటియుండినఫేనము, ఆసూర్యకిరణముల నాట్యము. సముద్రమధ్యమున దూరముననున్న యానౌక వీనినన్నిటిని జూచెను. నీలాకాశమున నొకపక్షి యెగురుచు నల్లనిమచ్చవలెం గనప్పట్టుచుండెను హిరణ్మయి దానినిగూడం జూచెను. తుద కామెదృష్టిని భూమిపైనున్న వాడిపోయినయొక పుష్పముపై నిలిపి యిట్లనియెను.

“ఇదివఱకును మీతండ్రి వెళ్ళుచుండెడివాడు. ఇప్పుడు నీవేలపోవలయును?”

"నాతండ్రికి వృద్ధత్వము వచ్చుచున్నది. ద్రవ్యము సంపాదించుటకు నాకిది సమయము ఆదేశమేగుటకు నా తండ్రి యాజ్ఞను పొందినాడను"

హిరణ్మయి పాదరింటిపై లలాటము నానుకొనియెను. ఆమె కనుబొమలు ముడివడుచుండెను. పెదవులు కంపించుచుండెను. నాసారంధ్రములు వికళితము లగుచుండెను వీని నన్నిటిని పురందరుఁడు చూచెను. హిరణ్మయికి నేత్రముల వెంట బాష్పములు ప్రవహింప నారభించెను.

పురందరుఁడు మొగము నావలివైపునకు ద్రిప్పుకొనియెను. ఆతనిదృష్టులుకూడ భూమిపైకిని పట్టణపు దిక్కునకును సముద్రమువంకకును, అన్నిప్రక్కలకును బోయెను. కాని ఎంత ప్రయత్నించినను పరంపరలయివచ్చి చెక్కులజాలువారుచున్న బాష్పోదకముల నాపలేక పోయెను. పురందరుఁడు తనహృదయ భావద్యోతకములగు చిహ్నములను కన్నులనుండి తుడిచివైచి యిట్లనియెను.

"ఈసంగతి నీతోఁ జెప్పుటకయి వచ్చితిని. నిన్ను నాకిచ్చి వివాహముసేయు నని నిష్కర్షగ మీతండ్రి చెప్పిన దినముననే సింహళమునకేగ దృఢచిత్తుఁడ నయితిని. తిరిగి వచ్చుటకు నా కెంతమాత్రము నుద్దేశములేదు. ఎప్పుడయిన

నిన్ను మఱవఁగలిగితినేని నేను తిరిగి రావచ్చును. అట్లు మాటలాడినను నీకుఁ బ్రయోజనములేదు. అతివిస్తరముగ మాటలాడ నాకలవాటులేదు. కాని చరాచర విశిష్టమగు నీ సర్వ ప్రపంచము నొకప్రక్కను, నిన్నొకప్రక్కను త్రాసుననుంచి తూచినప్పుడు నాకా ప్రపంచము నీతో సరిరాదనిమాత్రము నీవు గ్రహింపఁగలిగి యుందువు." ఇట్లు చెప్పుచు పురందరుఁడు తటాలున వెనుకకుఁ దిరిగి కొన్ని యడుగులు నడచి వేఱొక చెట్టునందలి యొకయాకును త్రుంపి చించివైచెను, పిదప భరింపశక్యముగాని విచారము నొక్కింత యాపుకొని మరలివచ్చి యిట్లనియెను. "నీవునన్ను ప్రేమించియుంటివని నేనెఱుంగుదును. కాని యిప్పుడో యింకొకప్పుడో నీవితరుని భార్యవు కాఁగలవు. కావున నన్నుఁ బూర్తిగ మఱచిపొమ్ము ఈభూమిపై మనమిఁక నెన్నఁడును మరలఁ గలసికొనఁజాలమని నానమ్మకము"

ఇట్లు చెప్పుచు పురందరుఁ డతిశీఘ్రముగ నడచి పోయెను. హిరణ్మయి చతికిలఁబడి యేడ్చుచుండెను. కొంత సేపటి కేడ్పుమాని యిట్లు తలపోయ నారంభించెను. "నేనీ దినమున మరణించినచోఁ బురందరుఁడు సింహళమున కేగునా ? ఈలతచే నురిపైచికొనియో, ఈజలధిలోఁ బడియో, నేనేల ప్రాణత్యాగ మొనర్పరాదు ?"

మరల నిట్లు యోచింపఁ దొడంగెను, "నేను చచ్చిపో వునెడల పురందరుఁడు సింహాళము పోయిన నేమి పోకున్న నాకేమి ?" అని తలంచి యామె మరల నేడ్వ నారంభించెను.

# రెండవ ప్రకరణము



"హిరణ్మయిని పురందరున కిచ్చి వివాహముచేయ" నని ధనదాసుఁ డెందులకనెనో యెవ్వరు నెఱుఁగరు. ఈరహస్యము నెప్పుడును ఆతఁ డెవ్వరికిని జెప్పియుండలేదు. ఎవ్వరైన నడిగినప్పుడు "దానికొక ప్రత్యేక కారణ మున్నది" అని ప్రత్యుత్తర మిచ్చుచుండును. హిరణ్మయిని పరిణయమాడ నెందఱో యరుగుదెంచిరి. కాని ధనదాసుఁ డెవ్వరి నంగీకరింపలేదు. హిరణ్మయి వివాహవిషయిక ప్రశంసయే యాతఁడు వినుటలేదు. "మన బాలిక పెద్దదగుచున్నది" అని యాతనిభార్య చెప్పుచుండెను. కాని ధనదాసుఁ డామాట వినిపించుకొనుటయే లేదు. "మన గురుదేవుఁడు రానిమ్ము. పిదప మన మీ విషయమున ముచ్చటింతము" అనిమాత్ర మనుచుండెను.

పురందరుఁడు సింహళముకెళ్లెను. ఆతఁ డేగినపిదప రెండుసంవత్సరములు గడచినవి. ఇంకను పురందరుఁడు తిరిగి రాలేదు. హిరణ్మయికి ఇతర సంబంధ మెక్కడను స్థిరపడలేదు. ఆమె కిప్పుడు పదునెనిమిదేండ్లు. వనమునందు పూచిన మామిడిగున్నవలె ధనదాసుని గృహమున కత్యంత శోభాయమానమై ప్రకాశించుచుండెను.

ఆమె యంతవిచారముగ నుండుటలేదు. ఆమెవివాహ మునుగూర్చినసంభాషణ జరిగినప్పుడెల్ల పురందరునిరూప మామెహృదయమునకుఁ గన్పట్టుచుండెను చక్కఁగ వికసించినపూలదండలచేతను, అపారముగ చుట్టలుచుట్టుకొనిన కుటిలకుంతలములచేతను నలంకృతమైయున్న యాతనినవ్వు మొగము, ఆమెకు జ్ఞాపకమునకు వచ్చుచుండును. దంతముల వలె నిగనిగలాడు నాతనిభుజముల నలంకరించియున్న బంగారుపుష్పములతోఁ గూడిన జలతారునీలియుత్తరీయము జ్ఞాపకమునకు వచ్చుచుండును. ఆతని కరకమలముల నలంకరించియున్న వజ్రాంగుళీయకములు జ్ఞాపకమునకు వచ్చుచుండును. అప్పుడామె యేడ్చుచుండును, ఇతరునెవ్వనినైన పెండ్లిచేసికొనుమని తండ్రి యాజ్ఞాపించినచో వానినామె పెండ్లియాడి తీరవలసినదే. కాని యది యామెకు జీవన్మరణము, తండ్రి తనవివాహవిషయమైన ప్రయత్నములకుఁ బ్రతికూలుఁడై యుండుటను జూచి యామె యంతసంతోషపడలేదు. కాని ఆశ్చర్యపడెను, అంతయీడువచ్చినంతవఱకును ఆకాలమున నెవ్వరును తమతనయుల పెండ్లిచేయకుండ నిలిపియుంచుటలేదు, ఒకవేళ నెవ్వరైన నట్లుంచినను ఈపరికి సంబంధమైన నిశ్చయించుకొని యుందురు. కాని హిరణ్మయి తండ్రి యట్టిసంబంధనిశ్చయమునకైన నింకను నేల యిచ్చగింపకుండెనో? ఆకస్మికముగ నొకనాఁడు హిరణ్మయి కీ గవా

స్యపుకిటుకొకటి బయలుపడియెను. వ్యాపారసందర్భమున ధనదాసునకు అందమైన చీనాదేశపుబరిణియొకటి వచ్చెను. అది చాలపెద్దది. ధనదాసునిభార్య దానిని తనయలంకారములనుంచుకొనుటకై యుపయోగించుచుండెను. ధనదాసుండు కొన్నిక్రొత్తయలంకారములఁ జేయించి వానిని తనభార్యకిచ్చెను. ఆతనిభార్య తనప్రాతయలంకారముల నాబరణియందుంచి తనతనయ కిచ్చెను. ఆమె వానిని బరీక్షించుచుండ నందామెకు సగము చినిఁగిపోయిన యుత్తరపుముక్కయొకటి కనఁబడియెను.

హిరణ్మయి చదువఁగలదు. ఉత్తరములోఁ దనపేరుండుటఁజూచి యామె కందలి విశేషముల నారయ నిచ్ఛపొడమెను. కాని చినిఁగిపోవగా మిగిలిన యాయర్థభాగమునుండి విషయమును గ్రహింప ననువుగాకపోయెను. ఆ యుత్తర మెవరికెవరువ్రాసిరో నిశ్చయింప వీలులేదు. అయినను ఆ ముక్కచదివినపిదప నామె చాల భయపడియెను. ఆ యర్థభాగమునందలి వాక్యము లివి.

"జ్యోతిష శాస్త్ర గణనముచే
నీవుచేయఁదలఁచిన కార్యము
కూడనిదని కనిపెట్టితి
బొమ్మవంటి హిరణ్మయి
ఆజన్మాంతము విధవ
ఆమెకిప్పుడు వివాహ
యాపదరానున్నది. జ్యో
జన్మాంతము గడుప
ఈవధూవరు లోక
ఖండనై దేండ్లు
లక్షఁగలశక్తి
నివర్తింపఁగ"

తెలియనిగొప్ప యాపద యేదియో రానై యున్నదని హిరణ్మయి చాలదిగులుపడెను. ఆమె యెవ్వరితోడను ఏమియుఁ జెప్పలేదు. కాని చినిఁగిపోయిన యా యుత్తరమును భద్రపఱచియుంచెను.



# మూఁడవ ప్రకరణము

రెండేండ్లు గడచినవి. ఇఁక నొకసంవత్సరముకూడ జరిగిపోయినది. ఇప్పటికిని సింహళమునుండి పురందరుఁడు తిరిగివచ్చువార్తలు లేవు. కాని హిరణ్మయిహృదయకమలమున పూర్వమువలెనే ప్రకాశమానమై పురందరునిరూపముండెను. పురందరుఁడు తనను మఱచిపోలేఁడనియు, లేనిచో నీపాటి కాతఁడు తిరిగి వచ్చియుండు ననియు నామె యవలీలగ గ్రహియించెను. ఈరీతిగ మూఁడుసంవత్సరములును గడచినవి. ఒకనాఁడు ధనదాసుఁడు "నాకుటుంబముతోఁగూడ నేనిప్పుడు కాశికిఁ బోవలయును. మాగురుదేవుని శిష్యుఁడొకఁడు వచ్చినాఁడు. ఆయన మమ్ముల నటకు రా నాజ్ఞాపించెను. హిరణ్మయి వివాహ మచ్చట జరుగఁగలదు. ఆయనయే వరుని స్థిరపఱచినాఁడు" అని యాకస్మికముగఁ జెప్పెను.

ధనదాసుఁడు భార్యతోడను, పుత్రికతోడను కాశికిఁ బయనమయ్యెను. సకాలమున వారు కాశికి సురక్షితముగఁ జేరిరి. ధనదాసునియాధ్యాత్మికగురువగుఆనందస్వామివచ్చివారినిజూచెను. మంగళప్రదమగువివాహదినము నిశ్చయింపఁబడి

యెను. శాస్త్రప్రకార మావశ్యకమైన సన్నాహము లన్నియుఁ జేయుమని యాతఁడు ధనదాసున కాజ్ఞయిచ్చెను.

శాస్త్రసంబంధమగు ప్రయత్నము లన్నియుఁ జేయఁబడినవి. కాని యీ వివాహమునకు వేడుక గాని, ఆడంబరముగాని లేదు. ధనదాసునిస్వజనము దక్క వేఱెవ్వరును వివాహముమాట యెఱుఁగరు. శాస్త్రీయమయిన కృత్యములకు కావలసిన యేర్పాటులుమాత్రమె గమనింపఁబడియెను.

వివాహదినమునాఁటి సాయంకాలము గడచిపోయినది. నాఁటిరాత్రి మొదటిజాములో సుమూహూర్తము. ఇంకను ఇంటివారు దక్క వేఱెవ్వరు నాగృహమందు లేరు. ఇరుగుపొరుగు నుండియైనను ఒక్కఁడయినను రాలేదు: వరుఁడెవ్వఁడో, ఎచ్చటివాఁడో, ధనదాసుఁడు దక్క మఱియెవ్వరు నెఱుఁగరు, కాని ఆనందస్వామి నిశ్చయపఱచుటచే నాసంబంధము యోగ్యమైనది కాకుండదని యందఱకును నమ్మకము. వరునివిషయమున నన్నిసంగతులను వెల్లడి చేయకుండుటకుఁ గలకారణ మొక్క స్వామికే తెలియును. మహాయోగియగు నానందస్వామి గంభీరహృదయము నెఱుంగ నెవ్వరితరము? కన్యాప్రదానమునకుఁ గావలసిన యేర్పాటులతో పురోహితుఁ డొకగదియం దొంటరిగఁ గూర్చుండియుండెను. పెండ్లికుమారుని రాకకయి నిరీక్షించుచు ధనదాసుఁ డొంటరిగ వెలుపలిగదియం దుండెను. పరిణయపు దుస్తులందాల్చి హిరణ్మయి యొక్క

తెయు అభ్యంతర మందిరమునఁ గూర్చుండి యుండెను. అందితరు లెవ్వరును లేరు. హిరణ్మయి యాశ్చర్యము నొంది యిట్లనుకొనుచుండెను. ఏమి యీగూఢ ప్రవర్తనము ! నను పురందరుని కిచ్చి పెండ్లి చేయరా యేమి ! నన్నితరున కిచ్చి వివాహము చేసినయెడల నాతనియెడల నామన సెట్లుండును ! నాకాతఁడు నిశ్చయముగ భర్త కాఁడు''

పెండ్లికుమార్తెను దోడుకొనిపోవ ధనదాసుఁడు లోపలకు వచ్చెను. ఆమెను వివాహవేదికకడకుం దోడ్కొనిపోవుటకుముందు, ఆతఁడొక వస్త్రము నామెకన్నులకుఁ గట్టిగ కట్టివైచెను.

''నాయనా ! ఇదియేమి ?'' అని హిరణ్మయి యడిగెను.

''ఇది గురుదేవునియాజ్ఞ, బిడ్డా ! నీవుకూడ నాయాజ్ఞానుసరణి బ్రవర్తింపవలయు. నీహృదయమున మంత్రములం బఠించుకొనుము.''

హిరణ్మయి మాటలాడ కూరకుండెను. కన్నులకుఁ గంతలు కట్టినతనయను ధనదాసుఁడు జేయివట్టి నడిపించుకొని వివాహ వేదికకడకుఁ గొనివచ్చెను.

ఆ ప్రదేశమును జేరినపిదప హిరణ్మయి యేవస్తువు నయినఁ జూడఁగలిగియుండెనేని వరుని నేత్రములకుఁగూడ తనకువలెనే కట్టు కట్టఁబడియుండె నని యామె తెలిసికొని

యుండును. వారల పరిణయ మహోత్సవ మీవిధముగ నడ చెను. ధనదాసుఁడు, ఆనందస్వామి, పురోహితుఁడు దక్క నట మఱియెవ్వరును లేరు. వధూవరు లొకరినొకరు చూచు కొనలేదు. శుభదృష్టి మహోత్సవ మీయిరువురకును జరుపఁ బడలేదు.

కన్యాప్రదాన మయినపిదప ఆనందస్వామి, దంపతు లం గూర్చి యిట్లనియెను. "మీయిరువురకును వివాహ మయినది. కాని మీరొకరి నొకరు చూచుకొనలేదు. వధువు ఇఁక మీఁదఁ గన్యగాఁ బరిగణింపఁబడకుండుటయే యీ వివాహముయొక్క ఫలితము. ఈజన్మమున మీ యిరువురు నొకరి నొకరు చూచుకొనెదరో లేదో నేను చెప్పఁజాలను. ఒకవేళ నట్లు చూచుకొనుట సంభవించినను ఒకరినొక రానవాలు పట్టలేరు. ఇఁక మీఁద మీ రిరువురును అన్యో న్యము ఆనవాలు పట్టుటకయి నేనొక యుపాయము నన్వే షించి యున్నాఁడను. నాప్రవేలియందు రెండుంగరములు న్నవి. అవిరెండును. ఒక్కపోలిక గలవి. వీనియందుఁ గూర్పఁబడిన రత్నములు చాల నరుదయినవి. ఆ యంగుళీ యకముల లోపలిభాగమున నెమలివిగ్రహము చెక్కఁబడి యున్నది. ఇందొక యుంగరము పెండ్లికుమారునకును రెండ వది పెండ్లికుమార్తెకును ఇచ్చెదను. యిట్టియుంగరములు మఱియెవరికడనుండవు. ఇంతేకాదు. ఇందు చెక్కఁబడిన నెమలివిగ్రహ మెరులచే నిర్మింపఁబడ సాధ్యముగానిది.

ఈ చెక్కడపుపని నాహస్తములతోఁ జేసితిని. పెండ్లికుమార్తె యెవనిచేతనయిన యుంగరముఁ జూచెనేని యాతఁడే తన భర్త యని గ్రహించునుగాక ! పెండ్లికుమారు డేయువతి వ్రేలినయిన నీయుంగుళీయకముఁ జూచెనేని యామెయే తన భార్య యని తెలిసికొనునుగాక ! ఈ యుంగరములను మీరు పోఁగొట్టుకొనఁగూడదు. ఎవ్వరికి నీయఁగూడదు, గతిలేక యాకటిచేఁ జచ్చి పోవునంతటి హీనస్థితి గలిగినను మీరు వీనిని విక్రయింపఁగూడదు. ఇదిగాక యిఁక నొకవిషయ మును మీ కాజ్ఞాపించుచున్నాఁడను. ఈదినము మొదలయిదు సంవత్సరములలోపల నెప్పుడును మీరు వీనిని ధరింపఁగూడదు, నేఁడు ఆషాఢశుద్ధ పంచమి. ఇప్పుడు రాత్రి పదునొకండు గడియలైనవి. ఇది మొదలు అయిదవ సంవత్సరమునందలి యాషాఢ శుద్ధపంచమివఱకు నీయంగుళీయకముల ధరించుట నిషేధింపఁబడినది. నాయాజ్ఞ నుపే క్షించితిరేని మీకధిక కష్టములు సంభవింపఁగలవు”

ఇట్లు చెప్పి స్వామి యటనుండి వెడలిపోయెను, ధన దాసుఁడు హిరణ్మయి కనులకుఁ గట్టిన వస్త్రమును విప్పి వైచెను. ఆమె చూడగలిగినప్పటి కాగదియందు తండ్రియు, పురోహితుఁడును దక్క నెవ్వరును లేరు. ఆమెభర్త యట లేఁడు; వివాహ మహోత్సవమునాఁటిరాత్రిని హిరణ్మయి యొంటరిగ గడపివైచెను.

---

# నాల్గవ ప్రకరణము

హిరణ్మయి వివాహ మయినపిదప ధనదాసుఁడు భార్యతోడను, పుత్రికతోడను స్వగృహమును జేరెను. పిమ్మట నాల్గుసంవత్సరములు జరిగినవి. ఇంకను పురందరుఁడు సింహళమునుండి రాలేదు. అతఁడు తిరిగివచ్చినను, రాకున్నను హిరణ్మయి కిప్పు డేమిలాభము ? ఏడుసంవత్సరము లైనను బురందరుఁడు రాకుండుటను జూచి యామె చాల దుఃఖించెను. ఆమెతనలో నిట్లుయోచించు కొనియెను. "అతఁ డింకను రాకుండుటకుఁ గారణ మేమై యుండును ? నన్ను మఱచిపోకుండుటయె దీనికిఁ గారణమా ! అట్లని యెట్లు తలంపవచ్చును ? ఇంతకు నాతఁడు జీవించి యుండెనో లేదో ! ఇది సందేహమే—ఆతనిఁ జూడ నాకిచ్ఛలేదు. నేనిప్పు డింకొకని భార్యను. అయినను నాచిన్ననాఁటి స్నేహితుఁడు జీవించి యుండవలెనని నేనేల కోరరాదు ?"

ఏలకో ధనదాసుఁడు కూడ మనోవ్యధచేఁ గుంది కృశించుచున్నటుల కన్పట్టుచుండెను,

క్రమక్రమముగ నది యధికమై తుద కొకకఠిన వ్యాధిగాఁ బరిణమించుటచే నాతఁడు కాలధర్మము నొందెను. అతనిభార్య యాతనితో సహగమనముసేయ చితి నెక్కెను. ఈమహాప్రపంచమున హిరణ్మయి కింక దిక్కెవ్వరు ? "నా"

యని పిలువఁదగినవారొక్కరును లేరు. తల్లి పాదముల పైఁ బడి సహగమనము సేయవలదని కన్నులనీరు కాలువలై ప్రవహింప నామెను బ్రతిమాలుకొనియెను. కాని ధనదాసుని భార్య యామెమాటల నాలకింపలేదు. ఈ ప్రపంచమున తాను దిక్కులేనిదాన నైపోయితినని హిరణ్మయి చాల దుఃఖించెను.

ధనదాసునిభార్య చితి నెక్కుటకుఁ బూర్వము హిరణ్మయి ననునయింప నెంచి యిట్లనియెను. "బిడ్డా! నీవెందులకు మనోవ్యధ నొందెదవు? నీకు భర్త యున్నాఁడు. అదృష్టకాలము రాగానే తిరిగి నీవాతనిని చేరఁగలవు. ఒకవేళ నట్లు చేరలేకపోయినను నీవు పసిబాలవు కావు. మానవుని కీప్రపంచమున సర్వసహాయముల నొడఁగూర్చు వస్తు వొకటి కలదు. అదియే భాగ్యము. అది నీకడ నపారముగ నున్నది"

కాని యాయాశ నిష్ఫల మయ్యెను. ధనదాసుని మరణానంతరము కాపురముండుగృహమును కొన్నియాభరణములును గృహపరికరణములును దక్క వేఱేమియు లేవు. హిరణ్మయి తఱచి చూచి ధనదాసునకుఁ గొన్ని సవంత్సరములనుండి వ్యాపారమున నష్టముగలుగుచున్న దని తెలిసికొనెను. అయిన నాతఁ డావిషయమును వెల్లడి సేయక ఋణములఁ దీర్చివేయ యత్నించుచుండెను. ఇదియే యాతని విచారహేతువు. తుద కాతని కష్టాలఁదీర్చుట సాధ్యము కాక

పోయెను. తన్మూలమున నాతఁడు విచారమునకు లోనై యా మనోవ్యాకులముచే వ్యాధిగ్రస్తుఁడయి మృతుఁడయ్యెను.

ఇతర వడ్డీవర్తకు లందఱు నీవ్యాపారస్థితిగతులను విని హిరణ్మయికడకు వచ్చి ధనదాసుఁడు తమకు బాకీపడియుండె ననియు ఆఋణము తీర్మానము చేయవలసిన దనియు నామె నడిగిరి. వారు నుడివినసంగతులు యథార్థమని యామె పరిశీలించి తెలిసికొనెను. ఆమెకుఁ గలిగినదంతయు విక్రయించి ఋణవిముక్తురా లయ్యెను. కాపురమున్న గృహమును గూడ నమ్మివైచెను.

హిరణ్మయి యిప్పు డత్యంతదరిద్రస్థితిలోనికి వచ్చెను. పట్టణమున కొకచివరనున్న యొకగుడిసెలో తల దాఁచుకొని యుండెను. ఆమె కీలోకమున ఆనందస్వామి యొక్కఁడు మాత్రమే స్నేహితుఁ డున్నాఁడు. కాని యాతఁడు కూడఁ జాలదూరమున నుండెను. ఆతనికడకు వర్తమాన మంపుట కయిన నామెయొద్ద నెవ్వరును లేరు.



# అయిదవ ప్రకరణము



హిరణ్మయి యౌవనవతి. అత్యంతసౌందర్యవతి. ఒంటరిగ నింట వాసముసేయుట యామె కంత శ్రేయస్కరము గాదు; అట్లుండిన నాపదకును, అపవాదమునకును గూడ హేతు వగును. ఒకగొల్లవానికూఁతురు అమల యనునది యామె యింటిపొరుగున నుండెను: ఆమె యౌవనవతి కాదు. ఆమె వితంతువు. ఆమె కొక కుమారుఁడును కుమార్తెయు నుండిరి. సద్వర్తనముగలది యని యామె నందఱు నెఱుంగుదురు. హిరణ్మయి రాత్రు లామె యింటికిఁ బోయి యామెతోఁ గూడ నిద్రించుచుండును.

ఒకనాఁటి సాయంకాలము వాడుకప్రకారము తన యింటికి వచ్చిన హిరణ్మయితో నమల యిట్లనియెను. "ఎనిమిది సంవత్సరములకుఁ దెఱువాత పురందరుఁ డను వడ్డివర్తకుఁడు మరలఁ బట్టణమునకు వచ్చినాఁడను వార్తను నీవు వింటివా ?"

హిరణ్మయి బాష్పోదకముల నమల చూడకుండ నుండుటకయి తన మొగము నావలిప్రక్కకుఁ ద్రిప్పికొనియెను. ఆమె నీప్రపంచముతోఁ గూర్చియుంచిన తుదిబంధము తటాలున

నంతలో తెగిపోయినది. పురందరుఁ డామెను తప్పక మఱచి పోయి యుండును. లేనిచో నాతఁడు పట్టణమునకు రాఁడు— పురంధరునకు జ్ఞాపకమున్నను లేకున్నను ఆమె కందువలన వచ్చులాభ మేమి ? నష్టమేమి ? అయినను ఎవని ప్రేమను జ్ఞాపకముచేసికొనుచు నిన్నిసంవత్సరము లీలోకమున హిరణ్మయి బ్రదుకఁ గలిగెనో అట్టియాతఁడు తన కిప్పుడు తన్ను మఱచిపోయె నని యామె తలంచి మిక్కిలి దుఃఖంచెను. ఆమె తనలో నిట్లు యోచించుకొనియెను. "నన్నాతఁడు మఱచిపోఁజాలఁడు. నానిమిత్త మాతఁ డిన్నాళ్ళు పరదేశమున నుండఁగలఁడు ? ఇదిగాక యాతని తండ్రికూడఁ జని పోయినాఁడు. ఇప్పు డింటికి రాకుండ నెట్లుండఁగలఁడు ?" ఆమె మరల నిట్లు యోచించెను. "నిశ్చయముగ నేను పాపాత్మురాలను, లేకున్న నిప్పుడు నా కా పురందరునిఁ గూర్చినయాలోచన మెందులకు?" అమలయామెనిట్లడిగెను.

"పురందరుఁడన నీకు జ్ఞాపకములేదా ? వడ్డివర్తకుఁ డగు శచిసుతుని కుమారుఁడు"

"అవును"

"ఆతఁడు తిరిగి వచ్చినాఁడు. లెక్కలేనన్ని నౌకలపై ధనమును గొని తెచ్చినాఁడు. అంతటిభాగ్యవంతుని నీతామ్రలిప్తపట్టణమున నిదివఱకెవ్వరును జూచి యుండలేదు"

హిరణ్మయి హృదయము మొక్కిలంతవడిగఁ గొట్టుకొనసాగెను. తనదరిద్రస్థితియుఁ దనకు నాతనికిగల పూర్వపు

స్నేహమును ఆమె మనసునకుఁ దెచ్చుకొనియెను. దారిద్ర్యముయొక్క బాధ అత్యంతము దుర్భరమయినది ఈఘోర దారిద్ర్యమునకు మారుగ సౌభాగ్య మంతయు నామెదయి యుండును. ఆ సమయమున హిరణ్మయి యాలోచించినటుల లోకములోని స్త్రీ లెవ్వరయిన నాలోచింతురేని వారి రక్త నాళములనుండికూడ రక్తము వడివడిగఁ బ్రవహింపవలసి నదే. కొంతసేపామె దీర్ఘచింతలో మునిఁగియుండెను. పిదప నితరవిషయమైన సంభాషణలోనికిఁ దిగెను తుదకామె పరుండఁబోవునప్పుడు అమలంజూచి "ఆపద్ధివర్తకుని తనయునకుఁ బరిణయమయినదా?" యనిప్రశ్నించెను. "లేదు" అని యామె బదులుచెప్పెను. హిరణ్మయి కింద్రియములు స్వాధీనము తప్పిపోయెను. ఇఁక నారాత్రి యేవిధమైన సంభాషణమును జరుగ లేదు.



# ఆఱవ ప్రకరణము



ఒకనాఁడు అమల చిఱునవ్వుతో హిరణ్మయికడకు వచ్చి ప్రేమసూచకముగ వీపుమీఁదఁ దట్టుచు "చెలీ! నీకిది తగునా?" అనియెను.

"ఏమి? నేనేమి చేసితిని?"

"ఇంతకాలమువఱకు నీవు నాతో చెప్పవైతివికదా!"

"నీతో నేనేమి చెప్పలేదు?"

"పురందరునితో నీకంత స్నేహముండెనని నాతో చెప్పితివా?"

హిరణ్మయి కొంచెము సిగ్గుపడి "బాల్యమున నే మిఱుగుపొరుగువారము నీతోఁ జెప్పుట కంతతికయ మేము న్నది?"

"ఇఱుగుపొరుగుమాత్రమేనా? నేనేమి తెచ్చితినో చూడుము"

ఇట్లుచెప్పుచు నమల యామెకొక బరణిని జూపించెను. దానిమూతను తెఱచి దివ్యమయిన రత్నములతోఁ గూర్పఁబడిన వేలలేనిహారము నొకదానిని హిరణ్మయికిఁ జూపెను. హిరణ్మయి యారత్నములను మెచ్చుకొనియెను.

ఆశ్చర్యముతో "దీనివెల యపారము. నీవు దీని నెక్కడ నుండి తెచ్చితివి ?" అని యడిగెను.

"పురందరుఁడు నీకొఱకిది పంపినాఁడు. నీవు నాయింట నుంటివని విని ఆతఁడు నన్ను పిలిపించి దీనిని నీకీయవలసిన దని నాచేతికిచ్చినాఁడు"

హిరణ్మయి యాలోచించుచుండెను. ఆ హారము నామె పుచ్చుకొనినచో దానితో నామెదారిద్ర్యము విచ్ఛిన్న మగును. ఆగర్భ శ్రీమంతురాలయి మిక్కిలి గారాబముతో పెంచబడిన ధనదాసుని ముద్దులపట్టి ఇట్టిదీనదశలో నికివచ్చెను. అపారమైన దరిద్రబాధ నామె యెంతమాత్రము భరింపఁజాలదు. అందుచే హిరణ్మయి కొంతవఱ కాలోచనలో మునిఁగియుండెను. అంతట నొక పెద్దనిట్టూర్పుపుచ్చి "నేనీ బహుమానము నంగీకరింపఁజాల నని దయయుంచి యాతనితోఁ జెప్పుము" అనియెను.

అమలచాల నాశ్చర్యపడి యిట్లనియెను. "అదేమి? నీకేమి మతిపోయినదా ? నామాటయందు నమ్మకము లేదా ?"

"నాకుమతిపోలేదు. నీమాటయందు నాకు విశ్వాసమున్నది. నేనాబహుమానము నంగీకరింపను"

అమల యామె నొడంబఱుప చాలసేపు ప్రయత్నించెను. కాని హిరణ్మయి యేవిధముచేతను నాహారము

నంగీకరించుట కిష్టపడలేదు. అమల మరల మదనదేవమహా రాజు నొద్దకు దీసికొని పోయెను. ఆతనికి వందనముచేసి హారమునిచ్చుచు మహారాజా! దీనినిమీరు గైకొనవలయును. దీనిని ధరింప, మీరే యర్హులు,'' అనియెను. రాజాహారమును బుచ్చుకొని అమలకుఁ దగినద్రవ్యమిచ్చి పంపెను. హిరణ్మయి యీగొడవయినుమంత యునెఱుంగదు.

పిదపఁ గొన్ని దినములు గడచినతరువాత పురందరుని సేవకురాలొక్కతె హిరణ్మయికడకువచ్చి యిట్లనియెను.

"నీ వీకుటీరమునఁ గాపురముండుట సహింపలేకుండ నున్నాఁడనని నాయజమానుఁడు నీతో చెప్పుమనియెను. నీవాతని బాల్యస్నేహితురాలవు. ఆయన గృహము నీది. నిన్ను తన యింటియందు కాపురముండుమని యాయన చెప్పెఁడు. మీతండ్రియప్పుల వాండ్రయొద్దనుండి మీ యిల్లు నాఁతడు క్రయమునకుఁ దీసికొనియెను. ఆగృహము నుచితముగా గైకొనుమని నిన్నాతఁడు వేఁడుకొనుచున్నాఁడు. నీవాయింటియందు నివసింపుమని యాతనికోరిక.''

హిరణ్మయి పొందుచున్న బాధలన్నిటిలో తండ్రి యింటినుండి వెడలిపోవుట యామెకు మిక్కిలి మనోవ్యథ కలిగించెను. ఎక్కడబాల్యమున నామెవిలాసముగ నాట

లాడు కొనెనో, ఎక్కడ పురందర సమేతయై నాటపాటల నలరుచు హాయిగా కాలముగడపెనో, ఎక్కడ నామెతలి దండ్రులు ప్రాణములను విడిచిపెట్టుట తాను చూచెనో, మనఃప్రియకారకమైన ఆగృహమున, తన్ను నివసింపనీయక పోయిరిగదాయని యామె లోలోపల చాల విచారమును పొందుచుండెను. అందుచే నాగృహసంబంధమగు ప్రశంస యామెకు బాష్పోదయకారణమయ్యెను. హిరణ్మయి యా దాసి నాశీర్వదించి "ఈదానమును నేనంగీకరింపరాదు. కాని యాశనతిక్రమింపలేకుండ నున్నదానను. అందుచే నంగీకరించితిని మీ యజమానునకు సర్వవిధముల నభ్యుదయ మగుగాక !"

దాసివందనము చేసి వెడలిపోయెను. అమల యచ్చటనే యుండెను. హిరణ్మయి యామెతో "నేనట నొంటరిగ నివసించియుండరాదు. నీవు కూడ నాతోనుండవల యును" అనియెను.

పురందరునియింటికి తఱచు పోవుచుండరాదని హిరణ్మయి యమలతోఁ జెప్పెను. అమలయు, నామె యాజ్ఞకు లోనయ్యెను.

తనతండ్రియింటికి కాపురమునకు వచ్చినది మొదలు హిరణ్మయి యొక్కవిషయమును గూర్చి యాశ్చర్యపడు

చుండెను. ఒకనాఁడమల యామెతో "గృహకృత్య వ్యయ మునుగూర్చి నీవు శ్రమపడ నవసరము లేదు. మఱియు పాటు పడఁ బనిలేదు. నేను రాజభవనమున సేవకురాలనుగ కుదిరితిని. నాకిఁక ద్రవ్యవిషయమైన లోప మేమియును లేదు. గృహకృత్య వ్యయము లన్నియు నింతటినుండి నేను భరించెదను. నీవు పైనుండి పరీక్షించుచుండుము" అని చెప్పెను. అమలకడఁ జాలధనమున్నట్లు హిరణ్మయి తెలిసికొనెను. ఆమెకు అనేకవిధములగు ననుమానములు కలిగెను.



# ఏడవ ప్రకరణము

వివాహమైనతరువాత నైదవసంవత్సరమున నాషాఢ శుద్ధ పంచమినాఁటిరాత్రి వచ్చినది. హిరణ్మయి యిది జ్ఞాపకమునకుఁ దెచ్చుకొని యాసాయంకాలమున నాలోచనలో మునిఁగి యుండెను.

"గురుదేవుని యాజ్ఞాప్రకారము తేపటియుదయము నుండియు నేనాయంగుళీయకమును ధరింపవచ్చును. కాని నేను ధరింతునా ? అందువలన నాకుఁ గలుగు ప్రయోజన మేమి ? బహుశః నాభర్తను కనుఁగొనఁగలుగుదును. కాని నాయుద్దేశ మట్లుచేయవలెనని లేదు. నాహృదయమున శాశ్వతముగా నన్యునిరూపమును నేనేల నిలువుకొనవలయును? ఉద్రేకముగల నాహృదయము నణంచివేయ వలయును, లేనిచో పతివ్రతాధర్మమును తప్పిపోయినదాన నగుదును"

ఆక్షణముననే అమల యక్కడకువచ్చి తొందర పడుచు ఆశ్చర్యముతో "ఏమి యుపద్రవమో ? ఏమి రానున్నదో ? నాకేమియు తెలియుటలేదు" అనియెను.

"ఏమది ?"

"రాజాస్థానమునుండి సేవకులు పాలకితో నిన్నుఁ గొనిపోవ వచ్చుచున్నారు"

"నీ కేమి మతిపోయినదా ? రాచనగరునుండి నన్నుఁ దీసికొనిపోవుటకై యేలవచ్చెదరు ?"

ఇంతలో రాజుకడనుండి దాసియొకర్తు వచ్చి హిరణ్మయికి వందనముచేసి వినయముతో రాచనగరునందలి యంతఃపురమునకు హిరణ్మయి పాలకి నెక్కి తక్షణము రావలయునని రారాజగు శ్రీమదనదేవమహారాజుగారి యాజ్ఞయైనది." అని యెను. హిరణ్మయి ఆశ్చర్యపడెను. కాని రాని నిరాకరింప లేక పోయెను. రాజాజ్ఞ యవిలంఘ్యము. ఇంతేగాక మదన దేవమహారాజుగారి యంతఃపురమున కేగుటంతో నామెకు భయహేతువు లేదు. రాజు ధర్మానువర్తి. గౌరవనీయుఁడు. సద్గుణగణవిరాజితుఁడు: అతని రాజ్యమున నెవ్వఁడును స్త్రీల నవమానపఱుప సాహసింపఁడు. అది యామహారాజు కఠిన శాసనము.

హిరణ్మయి యమలతో "నేను పోయివచ్చెదను. రాజాజ్ఞకై నిరీక్షించెదను. నీవుకూడ నాతోరమ్ము" అనెను. అమల సమ్మతించెను.

హిరణ్మయి అమలతోఁగూడ పాలకి నెక్కి రాజాంతఃపురమున కేగెను. ఒకపరిచారిక ధనదానునికుమార్తె వచ్చెనని రాజున కెఱింగించెను. రాజాజ్ఞననుసరించి యామెను రాజసమ్ముఖమునకుఁ గొని తెచ్చిరి. అమల వెలుపలిభాగమున నిరీక్షించియుండెను.

---

# ఏనిమిదవ ప్రకరణము

హిరణ్మయి రాజును జూచినతోడనే చాల కలవరము పొందెను. అతఁడు పొడగరి. ఆతనివక్షము విశాలమైనది. బాహువులు దీర్ఘములై మనోహరముగనుండెను. చక్కనిరూపముగలవాఁడు. ఆతని ఫాలప్రదేశము వెడల్పైనది. నేత్రములాకర్ణాంతములై ప్రకాశించుచుండెను. వదనము మిగులసౌమ్యముగ నుండెను. అట్టిసుందరాకారుని చూడలభించుట స్త్రీకి భాగ్యమే. ధనదాసునిపుత్రికను జూచి అట్టి చక్కఁదనము గలస్త్రీ తనయంతఃపురమునసయితము లేదని తలంచెను.

"హిరణ్మయివి నీవేనా ?"

"చిత్తము. నేనే తమ సేవకురాలను"

"నిన్నిక్కడకుఁ గొనిరా నాజ్ఞాపించిన కారణమును వినుము. నీవివాహవిషయము నీకు జ్ఞాపకమున్నదా ?"

"చిత్తము, జ్ఞాపకమున్నది."

"ఆరాత్రి యానందస్వామి నీకిచ్చినయంగుళీయకము నీయొద్దనున్నదా ?"

"చిత్తము. ఉన్నది. కానిఇవిచాల రహస్యమయిన విషయములు. ఏలిక యెట్లెఱుంగఁగలిగితిరి ?"

రాజు ప్రశ్నకుత్తర మీయక యే యిట్లడిగెను.

"ఆయుంగర మేది? నాకుఁ జూపింపుము!

"అది నాయింట విడిచి వచ్చితిని. అయిదుసంవత్సరములగుట కింకను కొన్నిగడియలు మాత్రమే జరుగవలసి యున్నవి. అది ధరించుట కింకను ఆనందస్వామి యాజ్ఞానియమము పూర్తి కాలేదు"

"మంచిది. కాని, ఆనందస్వామినీభర్త కిచ్చిన రెండవ యంగుళీయకమును నీవానవాలు పట్టఁగలవా?"

"రెండంగుళీయకములును ఒకరీతివే. అందుచే నది చూచిన నేను గుర్తింపగలను."

రాజునను మతి నొక పరిచారిక బంగారుబరణి నొకదానిని దెచ్చి యిచ్చెను. అందుండి రాజొక స్వర్ణాంగుళీయమును దీసి "ఇటుచూడుము. ఈయుంగర మెవరిది?" అని యడిగెను.

హిరణ్మయి దీపపువెల్తురున జాగ్రతగఁ బరీక్షించి చూచి "ప్రభూ! ఇదినాభర్తయంగుళీయకము. కాని యిది మీకెట్లు చిక్కినది?" అనెను. మఱల కొంచెమాలోచించి యామె "దీనినిబట్టి నేను విధవనైతినని తెలిసికొంటిని. వారసులు లేకుండ చనిపోయిన వానియాస్తిగా నిది మీయొద్దకుఁ జేరినది. ఏలన నాభర్త జీవించియున్నచో నీయంగుళీయకమును విడిచి యుండుటకు నావకాశము లేదు" అనియెను.

రాజు చిఱునవ్వునవ్వుచు నామెతో "నామాట నమ్ముము. నీవు విధవవు కావు" అనెను.

"అట్లయిన నాభర్త నాకంటె దరిద్రుండై ద్రవ్యము నకు దీనిని విక్రయించి యుండవలయును."

"అట్లుకాదు. నీభర్త చాల ధనవంతుండు"

"అట్లయిన మీరు దీనిని మోసముచేసియో బలవంత ముగనో ఆతనియొద్దనుండి గయికొని యుండవలయును"

హిరణ్మయి నిర్భయముగ నట్లు మాటలాడినందు లకు రాజు చాల నాశ్చర్యపడి యిట్లనియెను. "ఓయువతీ! నీవు చాల ధైర్యవతివి. ప్రాణములపై నాశ గలవారెవ్వ రును మదనదేవ మహారాజు సమ్ముఖమున నాతని చోరుం డని వచియింపంజాలరు"

"లేనిచో నంగుళీయక మెట్లు మీకు లభించినది?"

"నీ వివాహమునాంటిరాత్రి ఆనందస్వామి నాద్రేలి యందుంచెను."

హిరణ్మయి భూమిపై దృష్టిసారించి "నాథా! క్షమిం పుండు. . నోటికి వచ్చినట్లెల్ల ప్రేలితిని. ఎఱుంగకుండ నింద యొనర్చితిని," అనియెను.



# తొమ్మిదవ ప్రకరణము



హిరణ్మయి తాను రాణినైతినని తెలిసికొని చాల నాశ్చర్యపడెను. కాని సంతోషమెంతమాత్రము లేదు. విచారముతోడనే యుండెను. ఆమె మనసున నిట్లు యోచించుకొనియెను. పురందరుఁ డింకను నాకుఁ జిక్క లేదు. ఇతరునిభార్య నైనందులకు వచ్చెడు కష్టము నాకింత వఱకును గలుగలేదు. కాని యిదియిప్పు డారంభమైనది. ఇంతేకాదు. ఇప్పటికిని హృదయపూర్వకముగ నేనుపురంద రునిభార్యను: హృదయమున నాపావన చారిత్రుని విగ్ర హము నాటుకొని యుండ నీసుగుణాలవాలుని భర్తగా నం గీకరించి యీతనికుటుంబమునకు కళంకము తెచ్చుట కెట్లు సమ్మతింపఁగలను ?"

హిరణ్మయి యిట్లు తలపోయుచుండ రాజామెతో "హిరణ్మయీ! నీవు నిశ్చయముగ నారాణివి. కాని నిన్ను రాణిగా నేనంగీకరించుటకు ముందు నిన్నుఁ గొన్ని ప్రశ్నము లడుగవలసియున్నది. నీవు పురందరునియింట నద్దెయేమియు నీయకుండఁ గాపుర మేలయుంటివి ?"

హిరణ్మయి మాటలాడకుండ నెప్పటివలె గ్రిందికిఁ జూచుచుండెను. రాజు మఱల నిట్లు ప్రశ్నించెను.

"నీ పరిచారిక అమల తఱచుగ పురందరునియింటి కేల వచ్చుచుఁ బోవుచు నుండును ?"

హిరణ్మయి మిగుల సిగ్గుతో ముఖము నింకను గ్రిందికి వంచి యిట్లు తలపోయుచుండెను. "మదనదేవమహారాజు సర్వజ్ఞుఁడా యేమి చెపుమా ?"

రాజు మఱల నిట్లు ప్రశ్నించెను "ఇంకను ముఖ్యమగు సంశయమొకటి యున్నది. నీవొకని భార్యవై యుండియు పురందరుఁడు బహుమాన మంపిన రత్నాలహారము నేల యంగీకరించితివి ?"

అప్పుడు హిరణ్మయి తలను పయికెత్తి యిట్లు మాటలాడెను.

"మీరు సర్వజ్ఞులు కారని యిప్పు డెఱింగితిని. రత్నాలహారమును నేను గయికొనలేదు"

"నీవాహారమును నాకు విక్రయించితివి. ఇదిగో ఇక్కడనే యున్నది. చూడుము."

ఇట్లు చెప్పుచు నారాజొక పెట్టెనుండి హారమును దీసి హిరణ్మయికిఁ జూపించెను. హిరణ్మయి హారము నానవాలు పట్టి యాశ్చర్యముతో "ప్రభువునకిది నేను స్వయముగ విక్రయించితినా ?" అని యడిగెను.

"లేదు. నీదాసి అమల యమ్మినది. ఆమెను బిలిపింతునా ?"

విచారకరమైన హిరణ్మయి మొగమున చిఱునగ వంకురింప నిట్లనియెను. "నాథా! నన్ను క్షమింపుము. మీరు అమలను బిలువనంపనక్కఱ లేదు. ఆ విక్రయమునకు నే నంగీకరించితిని."

రాజాశ్చర్యమునొంది "స్త్రీస్వభావము తెలిసికొన నలవికాదు. ఇతరుని భార్యవైన నీవు పురందరునికడనుండి హారము నెట్లు గయికొంటివి?" అని యడిగెను.

"ప్రేమచే నిచ్చిన కానుకగావున నంగీకరించితిని."

రాజు మఱింత యాశ్చర్యపడి యిట్లనెను.

"అదెట్లు? ప్రేమచే నిచ్చు కానుక యెట్లయినది?"

"ప్రభూ! నే నపవిత్రురాలను. మీరాణిగా నుండఁ దగను. నే నిదెవందనము చేయుచున్నాను. నన్ను పోనిండు. నన్నుఁ బరిణయమాడినమాట మఱచిపొండు."

హిరణ్మయి రాజునకు నమస్కరించి పోవనున్నసమయమున తటాలున మోమునఁ జిఱునగవంకురింప రాజిట్లనియెను.

"హిరణ్మయీ! నీవు గెలుపొందితివి. నేను జయింపఁబడితిని. నీవు అపవిత్రురాలవును గావు నేను నీభర్తనుగాను. నిలువుము."

"ప్రభూ! అట్లయిన నిది యంతయు నెందులకు? దయచేసి చెప్పుడు. నేనల్పజ్ఞురాలను. అబలను. సాధుస్వభావముగల మీవంటిచక్రవర్తులు నాతో పరిహాసము చేయఁ బూనుదురనిన నమ్మజాలను."

రాజింగను నవ్వుచు "అట్టిపరిహాసము నాబోంటిరాజు కుమాత్రమే సాధ్యము. ఆఱుసంవత్సరములక్రిందట నీవస్తువుల పెట్టెలో నగముచినిగిపోయిన యుత్తర మొకటి దొరికినదా? అది యింకను నుండెనా?" అనియెను.

"ప్రభూ! నీవు నిశ్చయముగ సర్వజ్ఞుఁడవు. ఆయుత్తరపుముక్క నాయింటియొద్ద నున్నది"

పాలకిపై తిరిగి నీయింటికేగి దానిని గొనిరమ్ము. నీవు పఱల వచ్చినపిదప నన్నియును తెలియఁజెప్పెదను" అని గా జనియెను.



# పదియవ ప్రకరణము

రాజాజ్ఞానుసరణిని హిరణ్మయి యింటికి తిరిగి వెళ్ళి ఉత్తరపుముక్కను తీసికొని రాజసన్ముఖమునకు మరల వచ్చెను. రాజు దానిని చూచి ఒకబరణిలోనుండి యింకనొక కాగితపుముక్కను దీసి యామెకిచ్చి "రెండును జేర్చిచూడుము" అనెను. హిరణ్మయి వానిని జేర్చిచూచెను. రెండును సరిగా సరిపోయినవి. "ఇప్పుడా రెంటిని కలిపి యొకటిగా చదువుము" అని రాజనెను. హిరణ్మయి యిట్లుచదివెను.

"జ్యోతిషశాస్త్రగణనముచే నేను"
"నీవు చేయఁదలచిన కార్యము చేయు"
"కూడనిదని కనిపెట్టితిని. బంగారు"
"బొమ్మవంటి హిరణ్మయిని పాపము"
"ఆ జన్మాంతము విధవగాఁ జేయరాదు"
"ఆమెకిప్పుడు వివాహమగునెడల గొప్ప"
"యాపద రానున్నది. జ్యోతిషముచే ఆమెవిధవయై"
"జన్మాంతము గడుపవలసినదని యెఱింగితిని"
"ఈవధూవరు లొకరినొకరు చూడ"
"కుండ నయిదేండ్లు గడపినప్పు డాదుష్టగ్రహము"
"లకుఁ గలశక్తి నెడల్చి దంపతుల కాపదలు రాకుండ"
"నివర్తింపఁ గలవాఁడను."

చదువుట పూర్తి యయినతోడనే రాజిట్లనియెను "ఈయుత్తర మానందస్వామి నీతండ్రికి వ్రాసెను"

హిరణ్మయి యాలోచించి యిట్లనియెను,

"వివాహకాలమున మానేత్రములేల కట్టివేయఁబడెనో నా కిప్పుడు తెలిసినది. ఆవివాహమేల రహస్యముగఁ జరుపఁబడియెనో అయిదేండ్లవఱకును నేమాయంగుళీయకములను ధరింపకుండ నేల యాజ్ఞాపింపఁబడితినో నే నిప్పుడు గ్రహించితిని. కాని యింకను గల సంగతి యేమియు నాకుఁ దెలియదు"

"ఈయుత్తరము చూచినపిమ్మటనే మీతండ్రి నీవివాహమును గూర్చిన ప్రయత్నము లన్నియును మానివేసెననియు, తన్మూలమున పురందరుఁడు సింహళ మేగెననియు కూడ నీవు గ్రహింపవలసి యున్నది. ఈ లోపున నానందస్వామి నీ కొఱకు వరుని వెదకి సంబంధము స్థిరపఱచినాఁడు. ఆతని జాతకమును బరీక్షించి యానందస్వామి యాతఁ డెనుబదియేండ్లు జీవించునని తెలిసికొనియెను. కాని ఆతని కిరువది యెనిమిదవయేట నొక గండమున్నది. అప్పు డాతఁడు కాలధర్మము నొందిన నొందవచ్చును. ఆవయసు గడచినపిమ్మట నాతని పరిణయమైన యైదేండ్లలోపల భార్య శయ్యపై

మరణము నొందిన నొందవచ్చునని కూడ జ్యోతిష శాస్త్ర గణనముచే నాతఁడు గ్రహించెను. కాని యాతఁ డీవైదేం డ్లును జీవించెనేని చిరంజీవియగును''

“అందుచే వరుస కిరువదిమూఁడవయేడు గడచిన తోడనే పరిణయము స్థిరపఱుపఁబడియెను. అంతకాలము వివాహము కాకుండ నున్నందులకు నీవు విచారింపకుండగను, రహస్యముగ నితరుని నీవు పెండ్లియాడకుండగను, ఈయుత్త రార్థభాగము నీవస్తువులలో నుంపఁబడెను. అది నిన్ను భయపెట్టునని యట్లు చేయఁబడియెను.”

“మీ రిరువురు నొకరి నొకరు అయిదేండ్లవఱకును జూడకుండ చేసిన యుపాయము లన్నియు నీ వెఱుఁగుదువు ఇట్లు మీ రిరువురు నొకరి నొక రెఱుఁగకుండఁ గడచి పోయినది. కాని కొలది మాసములక్రిందట నితర కారణములు కొన్ని సంభవమైనవి. కొలఁది దినములక్రిందట నానందస్వామి యీపట్టణమునకు వచ్చెను. నీ బీదస్థితినిగూర్చి వినియాయన చాలవిచారించెను. ఆయన నిన్నుచూచెను. కాని నీవాయ నను జూడలేదు. ఆయన నీ వివాహవిషయమైన సంగతులను సవిస్తరముగాఁ జెప్పి తుదకు నాతో నిట్లని వచించెను.”

“హిరణ్మయి యిట్టిదురవస్థయందుండెనని నేనిదివఱ కెఱింగియుంటినేని దానినుండి కాపాడుటకయి నేనేమైనఁ

జేసియుంచును. ఇప్పుడు నీవది చక్క జేయవలయును ఈవిషయమున నన్ను నీఋణస్థునిగ భావింపుము. నీఋణమును నేను మరల తీర్చుకొందును. ప్రస్తుతమున నాకోరిక యింకొకటిగూడ నెఱవేర్పవలసియున్నది. నీవద్దానిని తప్పక చెల్లింపవలయును హిరణ్మయిభర్త యీ పట్టణములో నున్నాఁడు. వారిరువురును గలిసికొనకుండ చూచుచుండవలయును."

"ఇట్లు చెప్పుచు నాయన నీభర్త యెవ్వరో నాకెఱింగించినాఁడు. అప్పటినుండియు అమలకు ద్రవ్యమిచ్చి తన్మూలమున నీకు సౌఖ్యమొనగూర్చుచుంటిని. నీ తండ్రిగృహమును కొనినది నేనే. నీకు నివసించుట కిచ్చినదియు నేనే నిన్ను పరీక్షించుటకు రత్నహారమును బంపినదియు నేనే."

"ప్రభూ! మీకీయుంగర మెటనుండివచ్చినది? మీరేనాభర్తలని తెల్పి నన్నేలమోసపుచ్చితిరి? పురందరుని గృహమున నివసించి నందులకు నన్నేల నిందించితిరి?" అని హిరణ్మయియడిగెను.

"ఆనందస్వామి నాకాజ్ఞయొసంగిన వెంటనే నిన్నుఁ గనిపెట్టి చూచుచుండఁ గొందఱిని నియమించితి. ఆదినమున నే నీకు రత్నహారమంపితిని, అయిదేండ్లును నేటితోఁ బూర్తియగునని యెఱింగి నీభర్తకు వర్తమానమంపి యిట్లు చెప్పితిని. "ని వివాహ విషయమగు సంగతులనన్నిటి నే

నెఱుంగుదును. ఈనాఁటిరాత్రి పదునొకండు గడియలకు నీవివాహాంగుళీయకముతో మాభవనమునకు రమ్ము. నీవు నీభార్యను గలిసికొనఁగలవు" అతఁడు నాకిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "ఏలికయాజ్ఞలకు నేను విధేయుఁడనే. కాని నా భార్యను గలిసికొన నాకు దేశము లేదు. ఆమెను గలిసికొన కుండనుండుటయే నామనోభీష్టము" "అది నాయాజ్ఞ" యని నేనాతనికి మరలఁ బ్రత్యుత్తర మొసంగితిని. అందుపై నాతఁడందులకంగీకరించెను. కానియిఁక నొకవిషయమును చెప్పెను.

"నాభార్య పవిత్రమయినదియో కాదో మీ రెఱుఁగుదురు. అపవిత్రస్త్రీని భార్యగా నంగీకరించుఁడని యాజ్ఞా పించెదరేని అది మీగౌరవమున కేహానియగును, కానినాకు కాదు" అని చెప్పెను. "నీయంగుళీయకమును నాకిమ్ము. ఆమెను నేనుబరీక్షించిన పిదప నీవామెను భార్యగా నంగీక రించుమని చెప్పెద"నని యాతనితో నేనంటిని. "యుంగర మిచ్చుట కన్యుని నమ్మజాలను. కాని ఏలికవిషయమున నేనట్లన లేను" అనియాతఁడు బదులునుడివెను.

"అట్లేనిన్ను బరీక్షించితిని. అందునీవు జయము నొందితివి."

"ఆపరీక్షయెట్టిదో నేనేమియు నెఱుంగను." అని హిరణ్మయి యనియెను.

ఇంతలో రాజభవనమున శ్రావ్యమగు గానము వినవచ్చెను. రాజు హిరణ్మయితో "రాత్రిపదునొకండవ గడియ జరిగిపోయినది. పరీక్షావిషయమై పిదప నీతోఁ జెప్పెదను. దంపతు లొకరి నొకరు చూడవలసిన శుభముహూర్తము వచ్చినది. కావున నీభర్తతో శుభదృష్టి మహోత్సవమును జరుపుము" అనియెను,

అభ్యంతర మందిర ద్వారము తెరువఁబడియెను.

అందుండి దృఢశరీరుఁ డొకడరు దెంచెను,

"హిరణ్మయీ! నీభర్తయితఁడే" అని రాజనియెను.

ఆమె తలపైకెత్తి చూచెను. ఆమె యది కలయో సంతోషపూర్వకమైన యథార్థమో గ్రహింపలేకపోయెను. ఆతఁడు పురందరుఁడు. వారొకరినొకరు చూచికొనిరి. మోహపరవశత్వమున పిచ్చివారివలె నిరువురును సమీపమున కేగిచూచికొనుచుండిరి. ఎవరి నేత్రములను వారేనమ్ముట లేదు.

పురందరునితో రాజట్లనియెను.

"మిత్రమా! హిరణ్మయి నీకుఁ దగినభార్య. సంతోషముతో నీయింటికిఁ గొనిపొమ్ము నీమీఁద నామెకుఁ గల ప్రేమ యిప్పటివఱకును మారకుండ నట్లేయున్నది. ఆమె ప్రేమకు నీవొక్కఁడవేనిదానమవు. నీవుకోరినట్లామెను 24 గంటలు బరీక్షించితిని. నేనే ఆమెభర్తనని చెప్పితిని. కాని రాణినగుదునను నాశతోనైన నామె నిన్ను మఱవలేదు.

నేనా మెభర్తనని చెప్పుచు నీతోఁ దగనిస్నేహమునుగూర్చి అనుమానించునట్లు సూచించితిని. హిరణ్మయి విచారపడి "నేను నిర్దోషి" నని చెప్పియుండినచో తక్షణమే హిరణ్మయి నీ యెడల విశ్వాసహీనురాలని నీతో చెప్పి యుండును. కాని ఆమె యట్లన లేదు.

"మహారాజా! నేనపవిత్రురాలను. నన్నుపోనిమ్ము" అని చెప్పినది.

మఱియు రాజు హిరణ్మయినుద్దేశించి యిట్లనియెను.

"హిరణ్మయీ! అసమయమున నీభావములను పరికించిచాల మెచ్చుకొంటిని. ఇతరుని చేట్టఁబట్టుట కిచ్ఛగింపక నీవే యపవిత్రురాలనని చెప్పుకొంటిని. ఇప్పుడు నిన్నాశీర్వదించెదను. మీరందంపతులిరువురు నన్యోన్యానురాగముతో చిరకాలము వర్ధిల్లుదురుగాక!"

"మహారాజచంద్రా! నాకొక్కవిషయమును సెలవీయ వేడుకొనుచున్నదానను. ఈపూజనీయుఁ డప్పుడు సింహాళము నందున్నవాఁడు. ఈతనికిని నాకును కాశియందుఁ బరిణయమెట్లనది? ఆసమయమున నీతఁడు సింహాళము నుండి వచ్చియుండెనేని మాకేల తెలియలేదు?"

"ఆనందస్వామి పురందరుని తండ్రితో నాలోచించి యీతనిని సింహాళమునుండి తిన్నగ వారణాశికి తీసుకొని వచ్చినాఁడు. ఈతఁడు కాశినుండి మరల సింహాళమె వెడలి

పోయినాఁడు. ఈతఁడు శాప్రమలిప్తకు వచ్చియుండలేదు. అందుచే నీ వెఱుంగవు"

సంపూర్ణానందముతో పురందరుఁడు "మహారాజా! మీరు మాకెల్లసాహాయ్యమొసర్చి మా యాజన్మమనో భీష్టముల నెట్లొనగూర్చిరో అట్లే భగవంతుఁడు మీయభీష్టముల నొసంగి కృపఁజూచుఁగాక. ఈదినమున నేననుభవించిన సౌఖ్యముకంటె నధిక సుఖమును మీరాష్ట్రమున నెవ్వరును ఎప్పుడును అనుభవించియుండలేదు" అని చెప్పెను.

సంపూర్ణము.



# శ్రీమహాభారతము: వచనము

## మంత్రి లక్ష్మీనారాయణశాస్త్రి ప్రణీతము

18 పర్వములు – 16 సంపుటములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆదిపర్వము | | 4 | 0 | 0 |
| సభాపర్వము | | 1 | 0 | 0 |
| అరణ్యపర్వము | 1 వ భా॥ | 3 | 0 | 0 |
| డిటో | 2 వ భా॥ | 3 | 0 | 0 |
| విరాటపర్వము | | 2 | 8 | 0 |
| ఉద్యోగపర్వము | | 3 | 0 | 0 |
| భీష్మపర్వము | | 3 | 0 | 0 |
| ద్రోణపర్వము | | 3 | 0 | 0 |
| కర్ణపర్వము | | 2 | 0 | 0 |
| శల్యపర్వము | | 1 | 8 | 0 |
| సౌప్తికపర్వము | | 0 | 12 | 0 |
| స్త్రీపర్వము | | 0 | 8 | 0 |
| శాంతిపర్వము | | 4 | 8 | 0 |
| ఆనుశాసనిక పర్వము | | 3 | 0 | 0 |
| అశ్వమేధపర్వము | | 1 | 8 | 0 |
| ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు | | 1 | 4 | 0 |

పూర్తి సెట్టు వెల 37—8—0

దొరుకువారు :—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి.

# న వ ల లు

| | | | |
|---|---|---|---|
| అహల్యాబాయి | | 1 | 8 |
| రాజరత్నం | | 1 | 8 |
| కృష్ణవేణి | | 0 | 12 |
| హేమలత | | 1 | 4 |
| కర్పూరమంజరి | 1 వ భాగము | 2 | 0 |
| డిటో | 2 వ భాగము | 2 | 0 |
| రామచంద్రవిజయం | | 1 | 4 |
| సౌందర్యతిలక | 1 వ భాగము | 1 | 8 |
| డిటో | 2 వ భాగము | 1 | 8 |
| వినోదములు (Tit-Bits) | 1 వ భాగము | 1 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 |
| Tales of Rajasthan అను రాజస్థానకథావళి | 1 వ భా॥ | 1 | 8 |
| డిటో | 2 వ భా॥ | 1 | 8 |
| మణిమంజరి | | 0 | 8 |
| సువర్ణగుప్తుడు | | 0 | 8 |
| చమత్కారమంజరి | 1 వ భాగము | 1 | 0 |
| డిటో | 2 వ భాగము | 1 | 0 |
| Lives of Great men మహాపురుషుల జీవిత చరిత్రలు | 1 వ భాగము | 1 | 8 |
| డిటో | 2 వ భాగము | 1 | 8 |
| డిటో | 3 వ భాగము | 1 | 8 |

వలయువారు:—

కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు

శ్రీ సత్యనారాయణ బుక్ డిపో, రాజమండ్రి